ఉదయం ౦౦౦ 304617

ఆంధ్రసచిత్రవారపత్రిక
ప్రతి శుక్రవారం కొత్త సీరియల్స్‌తో, వ్యంగ్య చిత్రాలతో, తాజా సినీవార్తలతో వెలువడుచున్నది తప్పక చదవండి

PUBLISHED SIMULTANEOUSLY FROM MADRAS & VIJAYAWADA.

విజయవాడ
మంగళవారం
19—11—1974
THE ANDHRA PATRIKA
Regd. H / VJ. NO. 49

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO

సంపుటి: ౬౧ సంచిక: 224
పుటలు: 4
వెల: 25 పైసలు



# స్మగ్లర్ల నిర్బంధంపై రాష్ట్రపతి ఉత్తర్వుకు పార్లమెంట్‌లో నిరసన: ప్రతిపక్షాలవాకౌట్

న్యూఢిల్లీ, నవంబరు 18 : దొంగవాటు రవాణా సాగించారన్న ఆరోపణపై నిర్బంధించబడిన వ్యక్తులు ఆరుమాసాల వరకు కోర్టుకు వెళ్ళడానికి వీలులేకుండా నిషేధం విధిస్తు రాష్ట్రపతి జారీచేసిన ఉత్తర్వుపట్ల నిరసనగా నేడు పార్లమెంట్ ఉభయ సభల్లోను మితవాద కమ్యూనిస్టు పార్టీ మినహా మిగిలిన అన్ని ప్రతిపక్షాల సభ్యులు వాకవుట్ చేశారు.

అంతకు ముందు రాజ్యసభలో సభాధ్యక్షుడు శ్రీ జెత్తి రాష్ట్రపతి ఉత్తర్వుపై సభ్యులు తన అభిప్రాయాలు తెలపడానికి అవకాశ మివ్వగా, ఈ ఉత్తర్వు రాజ్యాంగ విరుద్ధం, రాజకీయ దురుద్దేశ ప్రేరితం అని ఆరోపించారు.

సంస్థా కాంగ్రెసు, జనసంఘం, సోషలిస్టు, మార్క్సిస్టు, డి.ఎం.కె. పక్షాలు వాకవుట్‌లో పాల్గొన్నారు.

విధిస్తూ రాష్ట్రపతి జారీ చేసిన ఉత్తర్వుపై ప్రతిపక్ష సభ్యులు కోపావేశంతో నిరసన తెలిపిన అనంతరం పార్లమెంటరీ వ్యవహారాల సహాయమంత్రి శ్రీ ఓంమెహతా నేడు రాజ్యసభలో ఈ హామీ యిచ్చారు.

అంతకు ముందు, ఆంతరంగిక భద్రతా పరిరక్షణ శాసనం (మైసా)ను సవరించే రాష్ట్రపతి ఉత్తర్వును రాజ్యసభకు సమర్పిస్తూ, ఈ ఉత్తర్వు కేవలం దొంగవాటు రవాణా దార్లను ఎదుర్కొనడానికి ఉద్దేశించబడింది, అది దుర్వినియోగ పర్చబడుతుందని ప్రతిపక్ష సభ్యులు ఆందోళన చెందనవసరం లేదని మంత్రి చెప్పారు.

ఈ ఉత్తర్వు రాజ్యాంగ విరుద్ధం, దురుద్దేశపూరితం, కర్కశం అని మితవాదకమ్యూనిస్టు పార్టీ మినహా మిగిలిన ప్రతిపక్షాలసభ్యులు విమర్శించి సభనుంచి వాకవుట్ చేశారు.

ఈ ఉత్తర్వు "అమాయకులకు, నేరస్థులకు" కూడా స్వేచ్ఛపొందే హక్కు లేకుండా చేస్తున్నదని, మైసా క్రింద అరెస్టయినదొంగవాటు రవాణా వారందరిని కోర్టులు వదలివేస్తున్నాయని ప్రభుత్వం చేసే వాదనతో తాము ఏకీభవించ జాలమని న్యాయవాద సభ్యుడు శ్రీ సి. కె. దఫ్తరీ (నామినేటెడ్) వాదించారు.

కొన్ని కోర్టుల తీర్పులను ఉదహరిస్తూ, డిటెన్యూలపై దాఖలు చేసిన ఫిర్యాదులు లోప భూయిష్ఠంగా వుంటే కోర్టులు ఏమి చేయగలవని ఆయన ప్రశ్నించారు.

తప్పంతా నిర్బంధించే అధికారులదేనని ఆయన అన్నారు.

క్రింది తరగతి అధికారులు శాసనాన్ని అమలు పరుస్తారు గనుక కొత్త ఉత్తర్వు దుర్వినియోగం కాదన్న హామీ లేదని ఆయన పేర్కొన్నారు.

రాష్ట్రపతి ఉత్తర్వును సభకు సమర్పించగానే, శ్రీ రాజీరే (బి. ఎల్. డి) మాట్లాడుతూ యీ ఉత్తర్వు "రాజ్యాంగ విరుద్ధం, దురుద్దేశపూరితం, కర్కశం అని విమర్శించారు. మైసాను దేశరక్షణ నిబంధనలకు ప్రతిపక్ష నాయకులను నిర్బంధించడానికి వినియోగించడం జరుగుతున్నదని ఆయన అన్నారు. పాలక పక్షానికి రాజకీయంగా వ్యతిరేకులయిన వారిపై ఈ కొత్త ఉత్తర్వు ఉపయోగించబడినదన్న హామీకి కూడా అదే గతి పడుతుందని ఆయన పేర్కొన్నారు.

శ్రీ ప్రకాశ్‌వీర్‌శాస్త్రి (జనసంఘం) మాట్లాడుతూ, పాలకపక్షానికి రాజకీయ మయిన నీతి నియమాలు లేవని ఆరోపించారు. అదే నిజం కాకపోతే దేశ రక్షణ నిబంధనల క్రింద జలంధర్‌లో ఆరు సంవత్సరాల పాటు నిర్బంధించబడిన వ్యక్తి కేంద్రమంత్రి ఎలా అవుతాడని ఆయన ప్రశ్నించారు. ఆ మంత్రిపేరు చెప్పవలసిందని కాంగ్రెసు సభ్యులు కోరినా ఆయన పేరు చెప్పలేదు.

శ్రీ ఎస్.ఎస్. మారిస్వామి (డి. ఎం. కె.) మాట్లాడుతూ, ఈ కొత్త ఉత్తర్వు ప్రతిపక్షాలపై ఉపయోగించబడుతుందని తమ పార్టీ విశ్వసిస్తున్నదని అందువల్ల ఈ ఉత్తర్వును తమపార్టీ బలపర్చజాలదని అన్నారు.

డాక్టర్ జడ్.ఎ. అహ్మద్ (మి.క) మాట్లాడుతూ, ప్రాథమిక హక్కులను పరిమితంగా అయినా తగ్గించడాన్ని తమ పార్టీ వ్యతిరేకిస్తున్నదని పేర్కొన్నారు. అయితే దొంగవాటు రవాణాదార్లు, ఆర్థిక సంబంధమయిన యితర నేరాలు చేసే వారిని శిక్షించడానికి మరింత శక్తిమంతమయిన శాసనాన్ని ప్రభుత్వం తీసుకురావాలని తమ పార్టీ కోరుతున్నదని, ఆయన అన్నారు.

శ్రీ మహావీర్‌త్యాగి (సంస్థా కాంగ్రెసు) : మాట్లాడుతూ, ఈ కొత్త ఉత్తర్వు "రవులాడ్ శాసనంకన్నా హీనమయినది" అని అన్నారు.

## దొంగరవాణా నిరోధానికి త్వరలో సమగ్ర శాసనం

న్యూఢిల్లీ, నవంబరు 18 : దొంగవాటు రవాణాను, దొంగవాటు రవాణాదార్లను శక్తిమంతంగా ఎదుర్కొనడం కోసం ప్రభుత్వం త్వరలో ఒక సమగ్రమయిన శాసనం తీసుకు రానున్నది.

దొంగవాటు రవాణా నేరం క్రింద నిర్బంధంలోకి తీసుకోబడినవారు ఆరునెలల వరకు కోర్టుకు పోవడానికి వీలులేకుండా నిషేధం

## లోక్ సభలో రభస

న్యూఢిల్లీ, నవంబర్ 18 : ప్రతిపక్షాల విమర్శలమధ్య, దొంగరవాణాదార్లు కోర్టులకు వెళ్లడాన్ని నిషేధిస్తూ రాష్ట్రపతి జారీచేసిన ఉత్తర్వును సభ ముందు వుంచడానికి దేశీయాంగమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డికి లోక్ సభ సభాపతి నేడు అనుమతి ఇచ్చారు.

సభలో ప్రశ్నోత్తరాల సమయం జరుగుతున్నప్పుడు, ఈ పత్రాన్ని సభముందు వుంచడానికి అనుమతి కోరుతూ నోటీసుఇవ్వబడింది.

పార్లమెంటుకు ఈ ఉత్తర్వును సమర్పించడంలో జాప్యం చేయడం ద్వారా ప్రభుత్వం సక్రమంగా వ్యవహరించలేదన్న ప్రతిపక్షాల అభిప్రాయంతో సభాపతి ఏకీభవించిన తర్వాత, ఈ పత్రాన్ని సభలో ఉంచడానికి దేశీయాంగ మంత్రికి అనుమతిఇచ్చారు.

సభా హక్కులకు భంగం కలిగించినందుకు ప్రభుత్వాన్ని తీవ్రంగా మందలించాలని, దేశీయాంగ మంత్రి క్షమాపణ చెప్పుకోవాలని మొత్తం ప్రతిపక్షసభ్యులంతా కోరారు.అయితే శ్రీ రెడ్డి ఈ జాప్యానికి కారణాలను వివరిస్తూ, ప్రభుత్వం వీలయినంత త్వరలో సభముందు ఈ పత్రాలను వుంచగలిగినట్లుచెప్పారు. ప్రభుత్వానికి సభపట్ల అత్యంత గౌరవం కలదని శ్రీ రెడ్డి చేసిన ప్రకటనపై ప్రతిపక్ష సభ్యులు హేళనగా నవ్వారు.

నేడు సభ ప్రారంభమయినప్పుడు ప్రతిపక్షసభ్యులు ప్రశాంతంగావుండి, ప్రశ్నోత్తరాలసమయం ప్రశాంతంగా జరుగనిచ్చారు. ప్రశ్నోత్తరాల సమయం పూర్తి ఆయిందని సభాపతి ప్రకటించగానే, 359వ అధికరణం క్రింద రాష్ట్రపతి ఉత్తర్వుజారీచేయడంవంటి ప్రధానరాజ్యాంగసంబంధమైనసమస్యలపైపార్లమెంటులో వ్యవహరించే ప్రభుత్వం "తెలిక పాటి వైఖరిని" అవలంబించడం పట్ల ప్రతిపక్ష నాయకులంతా తీవ్ర నిరసన తెలియజేశారు.

ఈ ఉత్తర్వును నేటి పార్లమెంటు కార్యక్రమంలో చేర్చడానికి గాను పార్లమెంటు సచివాలయానికి తెలియచేయకుండానే శనివారంనాడు ఈ ఉత్తర్వును ప్రభుత్వం ముందుగా పత్రికలకు, రేడియోకు అందజేయడంపట్ల పలువురు సభ్యులు అభ్యంతరం తెలిపారు. సభలో ప్రశ్నోత్తరాల సమయం జరుగుతుండగా ఉత్తర్వును సభ ముందు వుంచడానికి సభాపతి అనుమతి కోరే పత్రాన్ని సభాపతికి అందచేయడం సభ్యులకు మరింత ఆగ్రహం కలిగించింది.

రాజ్యాంగ నిబంధనలను ఉల్లంఘించడం ద్వారా ప్రభుత్వం సభా హక్కులకు భంగం కలిగించిందని వారన్నారు.

"ఇంతవరకు ప్రభుత్వం ఆర్డినెన్సులు జారీ చేయడం కోసం సభ వాయిదాపడే వరకు వేచి వుంటూ వచ్చిందన్నప్పుడు ప్రభుత్వం మరింత ముందుకు వెళ్ళి వారాంతపు సెలవురోజులకోసం వేచివుండే స్థితికి వెళ్ళింది" అని ఒకసభ్యుడు వ్యాఖ్యానించారు.

ఇటువంటి సందర్భాలలో అవలంబించవలసిన పద్ధతి అనుసరించలేదన్న ప్రతిపక్షాల అభిప్రాయంతో సభాపతి ఏకీభవిస్తూ,ఇలాంటి సంఘటన జరగడం ఇదే మొదటిసారి కాదని, లోగడకూడా ఇలాంటి సంఘటనలు జరిగినవని అన్నారు. రేడియోకు, పత్రికలకు తెలియజేసే సమయంలోనే పార్లమెంటు సచివాలయానికి కూడా ఈ పత్రాన్ని అందజేయడం మంచిదని, నోటి మాటగా తనకు చెప్పడంవల్ల ప్రయోజనం లేదని సభాపతి అన్నారు.

పార్లమెంటుకు ఈ ఉత్తర్వును గురించి తెలియజేయడంలో జాప్యం చేయడం సక్రమం కాదని సభాపతి పేర్కొంటూ, ఇది భవిష్యత్తులో మళ్లీ జరగకుండా చూడాలని మంత్రిని

(మిగతా 3 వ కాలంలో)



ఫ్రెంచి అధ్యక్షుడి పనుపున ప్రత్యేక దూతగా వచ్చిన శ్రీ మారిస్‌ఫూమాన్‌తో 15వ తేదీన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి సంభాషణలు జరిపినప్పటి చిత్రం.

# లైసెన్సుల కుంభకోణంపై లోక్‌సభలో మరో తీర్మానం

న్యూఢిల్లీ, నవంబర్ 18: లైసెన్సుల కుంభకోణం గురించి మరి కొంత చర్చ జరుగాలని కోరుతూ ఇద్దరు ప్రతిపక్ష సభ్యులు ప్రతిపాదించిన తీర్మానంతోసహా 11 తీర్మానాలను లోక్‌సభలో సభాపతి చర్చకు స్వీకరించారు. అయితే చర్చ తేదీలను నిర్ణయించలేదు.

లైసెన్సుల కుంభకోణం పై చర్చను కోరే తీర్మానాన్ని శ్రీ అతల్‌బిహారీవాజపాయ్ (జనసంఘం) శ్రీ సమర్‌గుహా (సోషలిస్టు) ప్రతిపాదించారు.

న్యాయవ్యవస్థ స్వతంత్ర ప్రతిపత్తి సిద్ధాంతానికి సామ్యవాదపరిణామావసరాలకు అనుగుణంగా సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టు న్యాయమూర్తుల హైకోర్టు న్యాయమూర్తుల నియామకం, పద్ధతులను నిర్వచించడానికి పార్లమెంటరీ సంఘాన్ని నియమించాలని కోరుతూ శ్రీ మధుదండావతే (సోషలిస్టు) ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు.

కాగితం కొరత, ఒరిస్సాలో చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధి, ఒకే రకమయిన విద్యా విధానం, చక్కెర విధానం, ఆర్. ఎస్. ఎస్. జమత్—ఇస్లామీ, ఆనంద మార్గ్ తదితర సంస్థల ప్రచారం నిషేధం మొదలయిన వాటిపై మిగతా తీర్మానాలు వచ్చాయి.

# చమురుపై ప్రపంచ సభ: భారత్ పరిశీలన

న్యూఢిల్లీ, నవంబర్ 18: చమురుకు సంబంధించిన విషయాల చర్చకు ఫ్రెంచి ప్రభుత్వం తలపెట్టిన సమావేశపు కొన్ని మౌలిక ఉద్దేశాలను భారత్ హర్షించిందని అయితే ఆ సమావేశంలో చర్చించబడనున్న పెక్కు సమస్యలను లోతుగా పరిశీలించవలసి వున్నందున, మనకు ఎంతో సహాయంగా వున్న ఆరబ్ దేశాల అభిప్రాయాలను కూడా పరిగణనలోకి తీసుకోవలసి వున్నందున ఈ ప్రతిపాదన పరిశీలనకు ప్రభుత్వం సహజంగానే మరి కొంత వ్యవధి కోరిందని పెట్రోలియం, రసాయనాల శాఖామంత్రి శ్రీ హెచ్. డి. మాలవ్యా నేడు రాజ్యసభలో చెప్పారు. ఫ్రెంచి ప్రభుత్వం ఏర్పాటు చేసిన సమావేశానికి భారత్ ఆహ్వానించబడిందా, ఫ్రెంచి అధ్యక్షుని ప్రత్యేక దూత మారిస్ స్క్యూమన్ యిటీవల ప్రభుత్వంతో చర్చలు జరిపినప్పుడు ప్రభుత్వం ఏ వైఖరి వ్యక్తం చేసిందని శ్రీ కృష్ణకాంత్ అడిగిన ప్రశ్నకు జవాబుగా ఆయన పై విషయాలు తెలిపారు.

భారత్‌ను ఈ సమావేశానికి ఆహ్వానించడం జరిగిందని శ్రీ మాలవ్యా చెప్పారు.

# పట్టణ ఆస్తులపై పరిమితికి త్వరలో పార్లమెంటులో బిల్లు

న్యూఢిల్లీ, నవంబరు 18 : పట్టణ ఆస్తుల పరిమితి బిల్లు సాధ్యమయినంత త్వరగా ప్రవేశపెట్టబడుతుందని, ఈ విషయం చురుకుగా పరిశీలించబడుతున్నదని వర్క్స్, హౌసింగ్ శాఖా మంత్రి శ్రీమోహన్ ధారియా నేడు లోక్‌సభలో ఒక ప్రశ్నకు లిఖిత పూర్వకంగా జవాబిచ్చారు.

## చౌ ఎన్—లై అస్వస్థత

పెకింగ్, నవంబరు 18: చైనా ప్రధాని చౌఎన్—లైకి పది వారాల క్రితం శస్త్ర చికిత్స జరిగిందని విశ్వసనీయ వర్గాలద్వారా తెలియవచ్చింది. ఈయనకు ఉదరంలో పుట్టకురుపు కలదని, ఆరు మాసాయిగా అస్వస్థతతో వుంటున్నారని పేర్కొనబడింది. చౌఎన్—లైకి గుండె నొప్పి కూడా కలదని తెలుస్తున్నది.

# శ్రీలంకనాయకులతోచర్చలకై చవాన్ కొలంబో పయనం

న్యూఢిల్లీ, నవంబరు 18 : విదేశ వ్యవహారాలమంత్రి శ్రీ వై. బి. చవాన్ శ్రీలంకలో మూడురోజుల సుహృద్భావ పర్యటన నిమిత్తం నేడు కొలంబో బయలుదేరి వెళ్ళారు. ఆయన అక్కడ నాయకులతో ద్వైపాక్షిక సంబంధాలపై ముఖ్యమైన చర్చలు జరుపుతారు.

శ్రీ చవాన్‌తో పాటు ఉన్నతస్థాయి ప్రతినిధి వర్గం కొలంబో బయలుదేరి వెళ్లింది. ఈ ప్రతినిధి వర్గంలో విదేశ వ్యవహారాల మంత్రిత్వశాఖలోని ముగ్గురు కార్యదర్శులు శ్రీ విష్ణుత్రివేది, శ్రీ రహ్మాన్, శ్రీ బి. కె.సన్యాల్ కూడా ఉన్నారు.

కొలంబోలో శ్రీ చవాన్ జరిపే చర్చల విషయమై ప్రత్యేకమైన అజెండా ఏదీ లేకపోయినప్పటికీ, ఉభయ దేశాల మధ్య ఆర్థిక సహకార విస్తరణ విషయం చర్చకు వచ్చే ప్రధానాంశాలలో ఒకటి కాగలదని భావించబడుతున్నది. కిందటి నెలలో ఇరాన్ రాజు ఇక్కడకు వచ్చినప్పుడు కూడా ప్రాంతీయ ఆర్థిక సహకారం విషయమై చర్చలు జరిగాయి.

విదేశాంగ మంత్రిగా శ్రీ చవాన్ విదేశీ పర్యటనకు వెళ్లడం ఇదే మొదటిసారి. శ్రీలంక వంటి పొరుగున గల మిత్రదేశంతో తన విదేశ పర్యటన ప్రారంభం కావడం తనకు సంతోషంగా ఉన్నదని శ్రీ చవాన్ కొలంబో బయలుదేరి వెళ్లేముందువిలేఖరులతోఅన్నారు. మన పొరుగు దేశాలతో మిత్ర సంబంధాలకు మనం ఎంతో విలువ ఇస్తాం. మన విదేశీ విధానంలో ఇది ముఖ్యమైన అంశం" అని శ్రీ చవాన్ అన్నారు.

శ్రీలంక నాయకులతో వ్యక్తిగత సంబంధాలు ఏర్పరచుకొని, వారితో అత్యంతమైత్రీ పూర్వకమైన చర్చలు జరపడం కోసంతాను ఎదురు చూస్తున్నానని ఆయన చెప్పారు.

శ్రీలంకలో తాను జరిపే చర్చలలో శ్రీ చవాన్ తనకు తానుగా నిర్దిష్టమైన రాజకీయ సమస్యలేవీ ప్రస్తావించరు. అయితే శ్రీలంక నాయకులు మాత్రం హిందూమహాసముద్రం పరిణామాలను గురించి ప్రస్తావించవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు.

హిందూ మహాసముద్ర ప్రాంతాన్ని శాంతి మండలంగా ప్రకటించాలని ఐక్యరాజ్యసమితి తీర్మానాన్ని శ్రీలంక ప్రతిపాదించినందువల్ల హిందుమహాసముద్రంలో నాటో కూటమి తలపెట్టిన విన్యాసాలు, నాటో కూటమిలో సభ్యత్వంలేని పాకిస్థాన్ ఈ విన్యాసాలలో పాల్గొనడానికి ప్రయత్నిస్తున్న విషయాలు భారతవలె శ్రీలంకకు కూడా ఆందోళన కలిగించగలవు.

న్యూఢిల్లీవిమానాశ్రయంవద్ద శ్రీ చవాన్‌కు ఉపమంత్రి శ్రీ బిపిన్‌పాల్‌దాస్, శ్రీలంక హైకమిషనర్ శ్రీ వర్ధనే, విదేశీవ్యవహారాలశాఖ అధికారులు వీడ్కోలు చెప్పారు.

# యు. పి. లో ధాన్యం దొంగరవాణా కేసు: దర్యాప్తునకు సి. బి. ఐ. తిరస్కృతి

న్యూఢిల్లీ, నవంబరు 18: యు. పి.లోని తరాయ్ ప్రాంతంనుంచి పరి వంగడాల రూపంలో ధాన్యాల ఎగుమతికి సంబంధించిన ఉదంతం గురించి యు. పి. ప్రభుత్వం తమకు నివేదించిన కేసుల విషయంలో దర్యాప్తు చేబట్టడం తమకు సాధ్యం కాదని కేంద్ర గూఢచారి సంస్థ (సి. బి. ఐ.) తెలియజేసింది.

వ్యవసాయశాఖ సహాయమంత్రి శ్రీ ఎ.పి. షిండే నేడు లోక్‌సభలో ఈ విషయాన్ని వెల్లడిస్తూ, యు. పి. ప్రభుత్వం దర్యాప్తు సాగుతోందని, సవివరమయిన నివేదికకోసం ఎదురు చూస్తున్నామని చెప్పారు.

శ్రీ ఎ. బి. వాజపాయ్ అడిగిన ప్రశ్నకు శ్రీ షిండే జవాబిస్తూ, ప్రతిపక్షాలు అనుమానిస్తున్న ఏ వ్యక్తి కూడా నేరం చేసినట్లు నిరూపించడానికి తగిన ఆధారాలను తెలియ జేసే సమాచారం ఇంతవరకు లభించలేదని యు. పి. ముఖ్యమంత్రితో తాను జరిపిన చర్చల వల్ల తేలిందన్నారు.

దొంగరవాణా జరిగిన సంగతి ప్రభుత్వానికి తెలుసునని ఈ వ్యవహారం గురించి సమగ్రమయిన దర్యాప్తు జరపాలని కేంద్రందాష్ట్ర ప్రభుత్వాన్ని కోరిందని ఆయన అన్నారు.

ఈ దర్యాప్తు ముగిసేలోగా తప్పు సమాచారాన్ని బట్టి ఎలాంటి చర్యకు దిగరాదని దీనివల్ల ప్రముఖులయిన వారిని అనవసరంగా రచ్చకీడ్చినట్లు కాగలదని ఆయన సభ్యులకు విజ్ఞప్తి చేశారు.

## శ్రీలంకలోరాజకీయసంక్షోభం:కొలంబోలోకర్ఫ్యూ

కొలంబో, నవంబరు 18 : శ్రీలంకలో రాజకీయ సంక్షోభం తలయెత్తింది. శ్రీలంక ప్రధాని శ్రీమతి సిరిమావో బండారునాయకే రష్యాలో తమ పర్యటన ముగించుకుని నిన్న స్వదేశానికి తిరిగి వచ్చారు.

శ్రీలంకలో ఐక్యసంఘటన ప్రభుత్వం అధికారంలో వున్నది. ఈ ఐక్యసంఘటన లంక సమసమాజ పార్టీ రెండవ పెద్దభాగస్వామిగా వున్నది.

సమసమాజ పార్టీ కార్మికుల ప్రదర్శనలు జరుపుతున్నది. వీటిని నిరోధించడానికి కొలంబోలో కర్ఫ్యూ విధించారు. దీనితో ఐక్య సంఘటనలో విభేదాలు తీవ్రమై రాజకీయ సంక్షోభం తలయెత్తింది.

ప్రధాన మంత్రి నాయకత్వానగల శ్రీలంక ఫ్రీడంపార్టీకి సమసమాజ పార్టీకి మధ్య కొంత కాలంగా విభేదాలు తలయెత్తినవి.

సమసమాజ పార్టీపై ప్రభుత్వం తీసుకున్న చర్య సమంజసంగా లేదని ఫ్రీడంపార్టీలోని అతివాద వర్గీయులు విమర్శించారు.

అన్ని రాజకీయ పార్టీల వాటి కార్మిక, యువజన సంఘాలు వార్షికోత్సవాలు జరుపుకునే సందర్భంలో ప్రదర్శనలు, ఊరేగింపులు జరుపుకోవడానికి అభ్యంతర పెట్టరాదని మంత్రివర్గం లోగడతీసుకున్న నిర్ణయానికి ప్రభుత్వం ఇప్పుడు తీసుకున్నచర్య విరుద్ధంగా వున్నదని శ్రీడం పార్టీలోని అతివాదులు అన్నారు.

శ్రీమతి బండారునాయకే తన పార్టీలో ఐకమత్యం సాధించడానికి ఇప్పుడు కృషి చేస్తున్నది.

ఇదిలా వుండగా సమసమాజ పార్టీలోని అతివాదులు శ్రీలంక ఫ్రీడంపార్టీ కొలంబోలో కర్ఫ్యూ విధించింది గనుక అది కార్మికుల, ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిందని, అందుచేత దానితో సంబంధాలు త్రెంచుకోవాలని గట్టిగా వాదిస్తున్నారు.

# లెబనాన్ దక్షిణతీరానగల స్థావరంపై ఇజ్రేలీ యుద్ధ పడవలచే 2 సార్లు కాల్పులు

టెల్‌అవీవ్, నవంబరు 18 : లెబనాన్ దక్షిణ తీరంలో రషిదియా వద్దగల పాలస్తీనా గెరిల్లాల స్థావరంపై ఇజ్రేలీ యుద్ధ పడవలు నిన్నరాత్రి రెండుసార్లు దాడులు జరిపాయని నేడిక్కడ ఇజ్రేలీ సైనిక ప్రతినిధి ఒకరు చెప్పారు.

తమ యుద్ధ పడవలు కాల్పులు జరిపి సురక్షితంగా తిరిగి వచ్చినవని ఆయన తెలిపారు. ఎంతసేపు కాల్పులు జరిగినదీ ఆయన వెల్లడించలేదు.

### లెబనాన్ ప్రకటన

బేరూట్, నవంబరు 18 : ఇజ్రేలీయుద్ధ పడవల దాడిని తమ శతఘ్నులు, టాంకు దళాలు త్రిప్పికొట్టి తరిమివేసినవని లెబనాన్ రక్షణ మంత్రిత్వశాఖ ప్రకటించింది.

రషిదియా వద్ద పాలస్తీనా కాందిశీకుల శిబిరంపై ఇజ్రేలీ యుద్ధ పడవలు దాడి చేసినవని, మొదటతడవ నిన్నరాత్రి 11—45గంటలకు (భారత కాలమానం 3—15) రెండు యుద్ధ పడవలు తమ ప్రాంతీయ జలాలలోకి ప్రవేశించి కాల్పులు జరుపగా, తమ దళాలు ఎదురు కాల్పులు జరిపి తరిమివేసినవని, తిరిగి ఒంటిగంట ప్రాంతంలో మళ్లీ వచ్చి దాడి చేసినవని, తమ దళాలకు ఎలాంటి నష్టం వాటిల్లలేదని లెబనాన్ తెలిపింది.

ఇదిలా వుండగా ఇజ్రేల్‌లోను, ఇజ్రేల్ ఆక్రమిత ఆరబ్ భూభాగాలలోను పాలస్తీనా గెరిల్లాలు గత 24 గంటలలోను పెక్కుచోట్ల మెరుపుదాడులు జరిపి అనేక మంది ఇజ్రేలీ సైనికులను హతమార్చారని అస్తిపాస్తులకు విశేషనష్టం కలిగించారని పాలస్తీనా వార్తా సంస్థ 'వఫా' డెమాస్కస్‌లో నిన్న ఒక ప్రకటనలో తెలియ జేసింది.

నెరుసలెం—హెబ్రాన్ రోడ్డువిూద ఇజ్రేలీ సైనిక గవర్నర్ ప్రయాణం చేస్తున్నకారుపై పాలస్తీనా గెరిల్లాలు నిన్న మరతుపాకులతో కాల్పులుజరుపగా, గవర్నర్ సహా మరి కొందరు గాయపడినట్లు పేర్కొనబడింది.

టెల్‌అవీవ్—హైఫారోడ్డులోఘోడెరియావద్ద గల ఇజ్రేలీ నావి గుమ్మటం దళాల శిబిరాన్ని గెరిల్లాలు పేల్చివేశారు. ఈ సంఘటనలో పెక్కుమంది ఇజ్రేలీ సైనికులు మరణించారు.

## అమెరికా అధ్యక్షుడు ఫోర్డ్ టోక్యో రాక

టోక్యో, నవంబరు 18 : అమెరికా అధ్యక్షుడు ఫోర్డ్ నేడిక్కడకు వచ్చారు.

ఫోర్డ్ రాక సందర్భంగా టోక్యో విమానాశ్రయంలోను, నగరంలోను పెద్ద ఎత్తున భద్రత చర్యలు తీసుకోబడినవి.

ఫోర్డ్, కిసింజర్ ప్రభృతులు హనెడా విమానాశ్రయంలో దిగగానే సైనిక వందనం సమర్పించబడింది. వెంటనే వారు హెలికాప్టర్ ఎక్కి నగర మధ్యభాగంలో ఉన్న ప్రభుత్వ అతిథిభవనానికి వెళ్లారు.

కట్టుదిట్టమైన భద్రతా చర్యలు తీసుకోబడినందున విమానాశ్రయంలో స్వాగత ప్రసంగాలేవీ జరుగలేదు.

## స్త్రీలను మించిన పురుషులు

ఐక్యరాజ్యసమితి, న్యూ యార్క్, నవంబర్ 18: ప్రపంచంలో పురుషుల సంఖ్య స్త్రీల సంఖ్యను మించి పోయింది. ఈ నాడు స్త్రీలకన్న పురుషులు 100 లక్షలు ఎక్కువగా వున్నారు. సమితి నివేదిక ఒకదానిలో ఈ విషయం వెల్లడయింది.

1965 లో ప్రపంచ జనాభాలో స్త్రీల సంఖ్య 116.5 కోట్లు కాగా పురుషుల సంఖ్య 113.7 కోట్లుగా వుండేది. ఈ పరిస్థితికి యిప్పుడు తారుమారవడంతో పురుషులు 199.8 కోట్లు మంది, స్త్రీలు 198.8 కోట్ల మంది వున్నారు. ప్రపంచంలో ఈ నాడు మొత్తం జనాభా సంఖ్య 398.6 కోట్లు

# ఉర్దూపట్ల అభిమానం ప్రకటించడంలో లోక్‌సభలో పలువురు సభ్యుల పోటాపోటీ

న్యూఢిల్లీ, నవంబరు 18: ఉర్దూ భాషపట్ల తమ అభిమానాన్ని ప్రకటించడంలో లోక్‌సభలో నేడు పలువురు సభ్యులు ఒకరితో ఒకరు పోటీ పడ్డారు.

ఉర్దూభాషాభివృద్ధికి అన్ని వసతులు సమకూర్చబడేట్లు చూసే విషయంలోను, ఉర్దూ మాట్లాడే వారికి విద్యా, సాంస్కృతిక పరిపాలనా సంబంధమయిన అవసరాలను తీర్చే విషయంలోను తమ ఆతృతను, ఆసక్తిని వ్యక్తం చేయడంలో కూడా సభ్యులు పోటీ పడ్డారు.

ఉర్దూ భాషాభివృద్ధికి 1972 మే లో నియమించబడిన గుజ్రాల్ సంఘం తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించినదా అన్న ప్రశ్నపై నేడు లోక్‌సభలో చర్చ జరిగింది. గుజ్రాల్ సంఘం తన నివేదికను త్వరలోనే ప్రభుత్వానికి సమర్పించగలదని విద్యాశాఖ ఉపమంత్రి శ్రీ డి. పి.యాదవ్ చెప్పినా కూడా సభ్యులు వూరుకోలేదు. ఒక రాష్ట్రములో అధికారభాషగా ఒకటికంటే ఎక్కువ భాషలను ప్రకటించడానికి వీలు కల్పించే ప్రతిపాదన ఏదయినా వున్నదా అని శ్రీ ఎ. బి. వాజపాయ్ (జన) అడిగారు.

అనుబంధ ప్రశ్నలు చాలా వరకు అసలు ప్రశ్నకు సంబంధించనివిగా వున్నాయని శ్రీ యాదవ్, సభాపతి శ్రీ ధిల్లాన్ పేర్కొన్నారు.

కాని సభ్యులు మాత్రం తమ అభిప్రాయాలను ప్రకటించడం మాన లేదు. యు. పి. లో ఉర్దూను రెండవ అధికార భాషగా చేస్తామని అధికార పక్షం ఎన్నికల్లో వాగ్దానం చేసినప్పటి దృష్ట్యా ఏ రాష్ట్రంలో నయినా రెండవ అధికార భాషను ప్రకటించే విషయంలో అనుసరించే పద్ధతిని ప్రభుత్వం వివరించగలదా అని శ్రీ వాజపాయ్ అడిగారు.

ఉర్దూభాష మాట్లాడే ప్రజలు అధిక సంఖ్యలో వున్న ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రాలలో ఉర్దూను రెండవ అధికార భాషగా ప్రకటించడానికి ఇబ్బంది ఏమిటని శ్రీమతి లక్ష్మీకాంతమ్మ (కాం) ప్రశ్నించారు.

సభలో ఉర్దూలో జరిగే ప్రసంగాలను దేవనాగరి లిపిలో కాకుండా ఉర్దూ లిపిలోనే రికార్డు చేయాలని శ్రీ ఎస్. ఎం. బెనర్జీ (మి. క) కోరారు.

ప్రస్తుత సమస్య భాషకు సంబంధించినదా, లిపికి సంబంధించినదా అని శ్రీ పి. పి. సాథే (కాం) అన్నారు.

ఉర్దూ భాష జన్మస్థానం భారతదేశమని పాకిస్థాన్‌లో ఆ భాషను వినియోగిస్తున్నందువల్ల ఎవరూ లేని పోని అపోహలకు లోను కావలసిన అవసరం లేదని శ్రీ మధులిమాయే (సో) అన్నారు.

# విజయవాడవద్దరైల్వేవ్యాగన్ రిపేరుకర్మాగారం: 13600 వ్యాగన్‌ల స్తోమతతో ఏర్పాటు

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 18: విజయవాడవద్ద సుమారు రు.15 కోట్లుగా అంచనా వేయబడిన ఖర్చుతో, కొత్తగా వ్యాగన్ రిపేరు వర్క్‌షాపును 1980—81 నాటికి 13600 వ్యాగన్‌ల— పోర్ వీలర్ యూనిట్స్ — స్తోమత సాధింపబడేట్లుగా నెలకొల్పటం జరుగుతున్నది. జాన్సీలోను, కోటాలోను వున్న రెండు రైల్వే వర్క్‌షాపులతో, అదనంగా ఏటా 10 వేల బ్రాడ్‌గేజి వ్యాగన్ల రిపేర్, వోవర్‌హాలింగ్ స్తోమత వుండేట్లు ఏర్పాటు చేయుటకు కూడా రైల్వేబోర్డు నిర్ణయించారు. ఇందుకు రు. 5 కోట్లు ఖర్చు కాగలదని అంచనా.

## హైదరాబాద్‌లో శ్రీ చవాన్

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబర్ 18: కొలంబో వెడుతూ నేడిక్కడ కొద్దిసేపు బేగంపేట విమానాశ్రయంలో ఆగిన విదేశ వ్యవహారాల మంత్రి శ్రీ వై. బి. చవాన్‌కు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ, విద్యాశాఖమంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు స్వాగతం ఇచ్చారు. భోజన విరామం కోసం శ్రీ చవాన్ ఇక్కడ గంటసేపు ఆగారు.

(2వ కాలం తరువాయి)

ఆదేశించారు.

లోక్‌సభలో ప్రతిపక్ష నాయకులు తమ వాయిదా తీర్మానాల స్వీకరణపై రెండుగంటలు జరిగిన చర్చలో పాల్గొంటూ తమ మనోభావాలు వెల్లడించారు.

దొంగరవాణాదార్లు కోర్టుకు వెడితే అధికారులు, రాజకీయ వాదులకు దొంగరవాణాతో ఉన్న సంబంధాలను గురించి అప్రతిష్ఠాకరమైన సాక్ష్యాధారాలు బయటకు వస్తాయి కనుక వారు కోర్టుకు వెళ్లకూడదని ప్రభుత్వం కోరుతున్నదన్నది ప్రతిపక్ష నాయకులు చేసిన ఆరోపణలలో ఒకటి.



# ఉపఎన్నికలకు కాంగ్రెస్ అభ్యర్థులు: అధిష్ఠానవర్గంతో చర్చలకు పి.సి.సి. అధ్యక్షునిఢిల్లీ యాత్ర

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబరు 18 : ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘ అధ్యక్షులు శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ గురువారం ఉదయం విమానంలో ఢిల్లీ వెడతారు. అక్కడ నుంచి 22, 23, 24 తేదీలలో సరోరాలో జరిగే ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుల ముఖ్యమంత్రుల సమావేశంలో పాల్గొనడానికివెళ్లి ఢిల్లీ చేరుకొంటారు. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఈ నెల 25న ఢిల్లీ వెడతారు. 24న హంగరీ ప్రధాన మంత్రి వస్తున్నందున వారికి స్వాగతం యివ్వడానికి ఆయన ఆ తేదీన ఇక్కడ ఉండవలసి వస్తుంది.

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు ముఖ్యమంత్రి శాసన సభలో రాయదుర్గం, కోయిలకుంట్ల డోర్నకల్ నియోజకవర్గాలకు ఏర్పడిన ఖాళీలకు కాంగ్రెసు అభ్యర్థులనియామకాన్ని గురించి అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు, ప్రధాన మంత్రిలో మాట్లాడతారు. కోయిలకుంట్ల నియోజక వర్గంనుంచి కీ. శే. బి.వి. సుబ్బారెడ్డిగారి కుమారుడు శ్రీ పాండురంగారెడ్డి ఆ స్థానములో తనకు అభ్యర్థిత్వాన్ని అడుగుతున్నారు. శ్రీ ఎం. వి. సుబ్బారెడ్డి కూడా అభ్యర్థిత్వాన్ని కోరుతున్న వారిలో ఒకరుగా వున్నారు.

డోర్నకల్ నియోజక వర్గం నుంచి కీ. శే. నూకల రామచంద్రారెడ్డి బావమరది శ్రీ సురేంద్రరెడ్డి అభ్యర్థిత్వాన్ని కోరుతున్నారు. పంచాయితీ సమితి అధ్యక్షులు శ్రీ వీరయ్య సుగాలీల ప్రతినిధి శ్రీ పిచ్చయ్య కూడా అభ్యర్థిత్వాన్ని కోరుతున్నారు.

రాయదుర్గం నియోజక వర్గం నుంచి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వెంకటనారాయణ కోరుతున్నారు. అది వెనుకబడిన వారి స్థానం కనుక బోయ వారికి ఆ స్థానం యివ్వాలని కొందరు అడుగుతున్నారు.





# రాష్ట్రాల్లో ఆహార ధాన్యాల ధరలు తగ్గుముఖం: షిండే ప్రకటన

న్యూఢిల్లీ, నవంబర్ 18: దాదాపు అన్ని రాష్ట్రాలలోను ఆహార ధాన్యాల ధరలు తగ్గుముఖం పట్టాయని, ఆహారధాన్యాలు లభ్యమయ్యే పరిస్థితి కూడా మెరుగు పడిందని వ్యవసాయ, నీటిపారుదలశాఖ సహాయమంత్రి శ్రీ ఎ. పి. షిండే నేడు లోక్‌సభలో లిఖిత పూర్వకంగా తెలియజేశారు. అక్రమ నిల్వదారులు, బ్లాక్ మార్కెట్‌దారులపై ప్రభుత్వం తీసుకున్న కఠినమయిన చర్యలు యిందుకు కారణమని కూడా ఆయన పేర్కొన్నారు.

సెప్టెంబర్ మూడవ వారానికి, అక్టోబర్ 26 వ తేదీకి మధ్య ఆహార ధాన్యాల టోకు ధరల సూచి 3.2 శాతం తగ్గినదని ఆయన తెలిపారు.

## గంటల పంచాంగం

శ్రీ ఆనందనామ సం. కార్తీక శు. పంచమి

1974వ సం. నవంబరు 19 మంగళవారం మంగ: శు.పంచమి: ఉ. 10.04, ఉత్తరాషాఢ: రా. 12.11, వర్జ్యం: ఉ. 6.27 మొదలు 8.13 వరకు. తె. 4.40 మొదలు.

1974 వ సం. నవంబరు 20 బుధవారం బుధ: శు. షష్ఠి: ప. 12.23 శ్రవణం: రా. 3.05. శేష వర్జ్యం: ఉ. 6.27 వరకు.

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 — 1972)

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబునకగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్ (మహాభారతము)

శ్రీ ఆనందనామ సం. కార్తీక శు. పంచమి మంగళవారం

## కొత్త ఉత్తర్వు

యుద్ధం జరుగుతున్నప్పుడు దేశం రక్షణ కోసం ప్రభుత్వం కొన్ని విశేషమయిన అధికారాలని తీసుకొనటంలో ఆశ్చర్యం లేదు. యుద్ధం అయిపోయిన తరువాత కూడా ప్రభుత్వం కొంతకాలం వరకు ఈ అధికారాలని వదులుకొనకుండా ఉండవచ్చు. ఆంతరంగిక భద్రతా చట్టం కొంతకాలంగా దేశంలో అమలులో ఉంటూనే ఉంది దానిని రద్దు చెయ్యాలని కొందరు తరచు అంటూనే ఉన్నారు. అహింసా సిద్ధాంతల మీద నమ్మకం లేని వారు కూడా దీని దుర్వినియోగం గురించి మాట్లాడుతూనే ఉన్నారు. ఇటువంటి వారి ఆరోపణలకి సమాధానం చెప్పటం కష్టం. అయినప్పటికీ అధికారంలో ఉన్న వారు పొరపాటునయినా నేరాలు చెయ్యని వారిని అక్రమంగా దండించరాదన్న వాదాన్ని తోసిపుచ్చటానికి వీలులేదు. దొంగరవాణా చేస్తున్న వారుగా పరిగణింపబడే వారిని కొందరిని ఇటీవల నిర్బంధించటం జరిగింది. నిర్బంధించే పద్ధతులలో లోపాల వలన వారి నిర్బంధం ఎక్కువ కాలం సాగలేదు. దొంగరవాణా చేసే వారు లేక స్మగ్లర్లు దేశానికి చెప్పలేనంత హాని చేస్తున్నారు. కనుక వారిని ఏ విధంగా నయినా దండించాలన్న వాదాన్ని పురస్కరించుకుని అధికారంలో ఉన్నవారు ఇటీవలే రాష్ట్రపతిచేత ఒక ఉత్తర్వుని జారీ చేయించారు. దాని ఫలితంగా స్మగ్లర్ల కింద పరిగణింపబడి నిర్బంధానికి గురి అయినవారు అప్పీలు చేసుకొనటానికి వీలులేని పరిస్థితి ఏర్పడినమాటనిజం. కొత్త ఉత్తర్వు దుర్వినియోగం కానంతకాలం ఎటువంటి ప్రమాదమూ లేదు. అధికారంలో ఉన్నవారు విచక్షణతో చట్టవిరుద్ధమయిన పనులు చేస్తున్న వారిని మాత్రం నిర్బంధించి, సకాలంలో విచారణ జరిపి తగిన నిర్ణయాలు జరగటానికి వీళ్ళు కల్పిస్తే మంచిదే; కాని, "మీసా" లేక అంతరంగిక భద్రతారక్షణచట్టం రాజకీయాలలో స్థానం చేసుకుంటే ప్రజాస్వామ్యవ్యవస్థకే ముప్పు కలుగుతుంది. అన్నివర్గాలవారు ఈ ప్రమాదాన్ని గుర్తించి, సంయమనంతో నడుచుకుని సంఘ విద్రోహులమీద తగిన చర్యలు ఏ విధంగా తీసుకుంటే మంచిదో నిర్ణయించాలి.

# గ్రంథాలయోద్యమం - కర్తవ్యాలు

ఆంధ్రదేశంలో గ్రంథాలయోద్యమం 19వ శతాబ్దంలోనే ప్రారంభమైంది. ఆప్పటిలో కొందరు పుస్తకాల ద్వారా ప్రజలకి విజ్ఞానం అందచెయ్యాలని వ్యక్తిగతంగా ఎందరో గ్రంథాలయాలని నెలకొల్పుకున్నారు. క్రమంగా ప్రజలందరికీ అందుబాటులో ఉండే గ్రంథాలయాల కొరకు ఉద్యమం దేశం అంతటా వ్యాపించింది. ఆంధ్రదేశంలో అయ్యంకి వెంకట రమణయ్య, గాడిచర్ల సర్వోత్తమరావుగార్ల పేరులు ఈ సందర్భంలో శాశ్వతకీర్తిని సంపాదించుకున్నాయి.

స్వాతంత్ర్యం అనంతరం ఉద్యమం పటిష్టత తగ్గింది. 1959లో ప్రభుత్వం గ్రంథాలయాల ఉద్యమం బాధ్యతని తనపైన వేసుకుంది, 1960లో "ఆం. ప్ర. గ్రంథాలయ చట్టం" ఒకటి రూపొందించింది కూడా. ఈ చట్టాన్ని అనుసరించి ప్రతిజిల్లాకి ఒక గ్రంథాలయసంస్థ ఏర్పడింది. ప్రభుత్వం వాటికి సొమ్ము సమకూర్చే విధానాన్ని నిర్ణయించింది.

### సిబ్బంది సమస్య

అయితే, అన్నిఖర్చులూ పెరిగిపోయిన ఈ రోజులలో లైబ్రరీల ఆదాయాలు సరిపోవటంలేదు. అసలు పంచాయితీలు, మునిసిపాలిటీలు వీటి తాలూకు పన్నుల్ని సక్రమంగా నిర్వహించటంలేదనే అనాలి.

ఇక సిబ్బంది జీతాల విషయంలో కూడా గ్రంథాలయ సంస్థలు నిస్సహాయస్థితిలో ఉన్నాయి. ప్రభుత్వానికి ఈ సంస్థల ప్రతినిధులు విజ్ఞప్తులు చేసుకున్నారు, అధికారులు కొన్ని పద్ధతులని అనుసరించటానికి ప్రయత్నిస్తున్నారు. కాని మొత్తం మీద పరిస్థితి సంతృప్తికరంగాలేదు.

రాష్ట్రంలో అన్ని గ్రంథాలయ సంస్థలలోనూ 1600మంది సిబ్బందిఉన్నారు. వీరు స్థానికోద్యోగులుగాగాని, రాష్ట్ర ప్రభుత్వోద్యోగులుగాగాని పరిగణింపబడటంలేదు. వారికి ప్రావిడెంటు ఫండు, పింఛను, గ్రాట్యుయిటీ మొదలయిన సౌకర్యాలులేవు. పైగా వారికి సరి జీతాలు సక్రమంగా అందటంలేదు. సిబ్బంది తమని కూడా రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు చెయ్యమని ఆందోళన చేస్తున్నారు.

### పుస్తకాలు

1969 తరువాత గ్రంథాలయాల పుస్తకాలని అధికారం జిల్లా సంస్థలకి లేకుండా చేసే నిబంధనలు అమలులోకి వచ్చాయి. మంచి పుస్తకాలనికాని స్థానిక అధికారులు కొని ఉండకుండా చేసేందుకు ఇటువంటి చర్య తీసుకొనబడిందనవచ్చు. ఎటువంటి పుస్తకాలు లైబ్రరీలలో ఉండాలో నిర్ణయించే కమిటీ ఒకటి ఏర్పరచటం జరిగింది. పుస్తకాలుకొనే పద్ధతులు నిర్ణయించటం కూడా జరిగింది. ఈ కట్టుబాట్లవలన పుస్తకాలు కొనటం, తెప్పించటం చాలా ఆలస్యం అవుతోంది.

డిటెక్టివ్, శృంగార సాహిత్యాన్ని తప్పించి ఇతర పుస్తకాలని జిల్లా గ్రంథాలయ సంస్థ ఎన్నిక కమిటీ ఎంచిన పుస్తకాలనికొనే అధికారం జిల్లా గ్రంథాలయ సంస్థలకి ఇస్తే బాగా ఉంటుంది.

### దానాలు

ఇప్పుడు దానాలు ప్రభుత్వం అనుమతి లేనిదే ఆమోదించరాదన్న నిబంధన ఉంది. ఈ నిబంధన ఎందుకో అర్థంకాదు. ప్రభుత్వం ఆమోదం తెచ్చుకొనటం ఎంతో కష్టంగానూ ఆలస్యంతో కూడిన పని గానూ తయారవుతోంది.

### అభివృద్ధికి సూచనలు

ప్రస్తుతం అమలులో ఉన్న "రిక్రూట్‌మెంట్" పద్ధతి బాగాలేదు. జిల్లా ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజి అధికారి పంపిన జాబితా నుంచి మాత్రమేకాక పత్రికా ప్రకటనలకి సమాధానంగా వచ్చిన (ఎం. ఎల్‌లో రిజిష్టరు అయిన) అభ్యర్థుల దరఖాస్తులని పరిశీలించి ఉద్యోగాలు ఇచ్చే అధికారం జిల్లా సంస్థలకి ఉండాలి.

ప్రతి గ్రంథాలయం వివిధ సాంస్కృతిక కార్యక్రమాలకి వేదిక కావటానికి తగిన మార్పులు, అభివృద్ధి జరుగాలి.

జనసంఖ్య మించిన జనాభాకల గ్రామాలలోనే బ్రాంచి గ్రంథాలయాలని నెలకొల్పాలని చట్టం అంటున్నది. చిన్నగ్రామాలకి కనీసం రిక్షా, బళ్ళమీద పుస్తకాలని పంపించి "సంచార గ్రంథాలయా"లని ఏర్పాటు చెయ్యాలి.

గ్రామాలలోనే కాక పట్టణాలలోనూ ఆడవారికోసం ఇళ్ళకి పుస్తకాలు ఇచ్చే సంచార గ్రంథాలయాలు ఏర్పరచాలి.

జిల్లా గ్రంథాలయ సంస్థలకి ఆర్థిక సంపత్తిని "సెస్సు"ల వంటి పన్నుల ద్వారానే కాక ఇతర విధాలుగా కూడా ధనాదాయం వచ్చేటట్లు చూడాలి. అన్ని రకాల అభివృద్ధికి ప్రజల సహకారం, ప్రభుత్వం తోడ్పాటూ అవసరం.

**కె. వి. కొండలరావు**
తూర్పు గోదావరి జిల్లా గ్రంథాలయసంస్థ అధ్యక్షులు

# హిందూమహాసముద్రంలో నాటో రాజ్యాల సైనిక విన్యాసాలు, స్థావరాలు: స్వరణ్‌సింగ్ తీవ్ర విమర్శ

న్యూఢిల్లీ, నవంబరు 18: హిందూ మహాసముద్రం ఉత్తర భాగంలో నాటో రాజ్యాలు, నాటోలో సభ్యత్వం లేని కొన్ని రాజ్యాలు జరుపదలచుకున్న సైనిక విన్యాసాలను భారత ప్రభుత్వం ప్రతిఘటిస్తున్నదని రక్షణమంత్రి శ్రీ స్వరణ్‌సింగ్ నిన్న ప్రకటించారు.

హిందూ మహాసముద్రంపై జరిగిన అంతర్జాతీయ ముగింపు సమావేశంలో శ్రీ స్వరణ్‌సింగ్ నేడు ప్రసంగించారు. హిందూ మహాసముద్రంలో నాటో రాజ్యాలు జరుపదల్చుకున్న విన్యాసాలలో నాటోలో సభ్యత్వం లేని పాకిస్తాన్ వంటి దేశాలు కొన్ని పాల్గొనబోతున్నట్లు భారతప్రభుత్వానికి సమాచారం అందిందని శ్రీ సింగ్ అన్నారు.

నాటోలో సభ్యత్వం లేని పాకిస్తాన్‌ను కూడా ఈ విన్యాసాలలో చేర్చటంవలన ఈ ప్రాంతంలో ఉద్రిక్త పరిస్థితిని నాటో రాజ్యాలు పెంచినట్లు అయిందని కూడా రక్షణమంత్రి అన్నారు. నాటో రాజ్యాలు అట్లాంటిక్ మహాసముద్రంలో గాకుండా హిందూ మహాసముద్రంలో సైనిక విన్యాసాలను ఎందుకు జరుపవలసి వచ్చిందని ఆయన ప్రశ్నించారు. ఏదో ఒక సైనిక లక్ష్యాన్ని సాధించడానికి వీరు యీ పని చేస్తున్నట్లు కనిపిస్తున్నదని కూడా రక్షణమంత్రి అన్నారు.

హిందూమహాసముద్రంలో ఏ రకమైన సైనిక స్థావరాలు గాని యుద్ధ నౌకలుగాని వుండటం పట్ల భారతప్రభుత్వపు తీవ్ర ప్రతిఘటనను శ్రీ సింగ్ పునరుద్ఘాటించారు.

కేంద్ర పెట్రోలియం రసాయనాల మంత్రి శ్రీ కె. డి. మాలవీయ ప్రసంగిస్తూ హిందూమహాసముద్రంలో అగ్ర రాజ్యాల సైనిక స్థావరాలను ఏర్పరచటం వలన ఆసియా దేశాలకేగాక, భారత ఉపఖండంలోని దేశాలకుకూడా సుస్థిరత లేకుండాపొయ్యే పరిస్థితి ఏర్పడిందని అన్నారు.

నేటి సమావేశంలో పోర్చుగల్, ఇరాక్ మరికొన్ని ఆరబ్ దేశాలు, రష్యా ప్రతినిధులు ప్రసంగించారు. వారంతా హిందూమహాసముద్రాన్ని శాంతిమండలంగా వుంచాలనీ, డిగోగార్షియాలో అమెరికా తన స్థావరాలను నిర్మాణించాలనీ కోరారు.

హిందూమహాసముద్రంలో సైనిక స్థావరాలను ఏర్పాటుచేసే యుద్ధ నౌకలను నిలపాలన్న సామ్రాజ్యవాద దేశాల ప్రయత్నాలను ప్రపంచంలోని శాంతి శక్తులు విఫలం చేయాలని ఇచ్చట నాలుగు రోజుల పాటు జరిగిన అంతర్జాతీయ మహాసభ నేడు జారీ చేసిన ప్రకటనలో విజ్ఞప్తి చేసింది.

హిందూమహాసముద్ర ప్రాంత దేశాలు సమిష్టిగా యీ అంశంపై ప్రపంచాభిప్రాయాన్ని సేకరించడానికి కృషి చేయాలని కూడా మహాసభ నేడు ఆమోదించిన ప్రకటనలో విజ్ఞప్తి చేసింది.

మహాసభ ఐక్యరాజ్యసమితికి ఒక సందేశం పంపుతూ హిందూమహాసముద్రంలో అమెరికా, దాని మిత్ర రాజ్యాలు సైనిక స్థావరాలు ఏర్పాటుచేయటం పట్ల యీ మహాసభలో పాల్గొన్న దేశాలు తీవ్రమైన ఆందోళన చెందుతున్నట్లు పేర్కొన్నారు.

హిందూమహాసముద్రంలో సైనిక స్థావరాలను తొలగించటం వలన యీ ప్రాంతంలోని దేశాలు తమ సైనిక ఖర్చును తగ్గించుకొని ఆర్థికాభివృద్ధికి ఇంకా కృషి చేయుటానికి వీలు అవుతుందని ఒక తీర్మానంలో మహాసభ పేర్కొన్నది. ఈ తీర్మానాన్ని మారిషస్ మంత్రి శ్రీ కేర్‌ఇంద్రజిత్‌సింగ్ ప్రతిపాదించారు.

దక్షిణాఫ్రికా, ఇండోచైనాలపై కూడ మహాసభ నేడు తీర్మానాలను ఆమోదించింది. ఇటీవల సమితి నుండి దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వాన్ని బహిష్కరించటం చేత ఈ ప్రాంతంలో స్వేచ్ఛాశక్తులకు బలం చేకూరినట్లయిందని మహాసభ పేర్కొన్నది. దక్షిణ వియత్నాం, లావోస్, కంబోడియాలలో అమెరికా సైనిక చర్యలను ఒక తీర్మానంలో మహాసభ విమర్శించింది.

### విదేశీ ప్రతినిధులకు సన్మానం

అంతర్జాతీయ మహాసభలో పాల్గొన్న విదేశీ ప్రతినిధులకు కాంగ్రెసు అధ్యక్షుడు నేడు సన్మానం చేశారు. సన్మాన సమావేశంలో సోవియట్ ప్రతినిధి శ్రీ పాపాన్, ఉత్తర వియత్నాం ప్రతినిధి శ్రీ గుయెన్‌మై, శ్రీలంక ప్రతినిధి శ్రీ చంద్రగుణశేఖర్ ప్రభృతులు ప్రసంగించారు.

# చెరుకు కనీస ధరపై కేంద్ర ప్రభుత్వ వైఖరి: రాష్ట్ర చెరుకు రైతు సంఘం ఆగ్రహం

విజయవాడ, నవంబరు 18: 1974—75 సంవత్సరం చెరుకు సీజన్‌లో టన్నుకు రు.120లు చొప్పున చెరుకుకి ధర ఇవ్వాలనీ, స్వేచ్ఛా విపణిలో చక్కెర అమ్మకాల ద్వారా వచ్చే మొత్తంలో 66 శాతం చెరుకు రైతులకు ఇవ్వాలనీ తాను చేసిన నిర్ణయాన్నిరాష్ట్రంలోని చక్కెర ఫ్యాక్టరీలన్నీ అమలు జరిపేట్లు రాష్ట్ర ప్రభుత్వం చూడాలని ఆంధ్రప్రదేశ్ చెరుకు రైతుల సంఘం తాలూకు కార్యాచరణ సంఘం నిన్న కోరింది.

కార్యాచరణ సంఘ అత్యవసర సమావేశానికి శ్రీ మల్లెల పద్మనాభరావు అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ ఎం. భావనాచారి నివేదిక సమర్పిస్తూ, చెరుకు ధర విషయంలో రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాన్ని అమలు చేయడానికి నిరాకరిస్తూ ప్రైవేట్ చక్కెర ఫ్యాక్టరీలు ప్రదర్శిస్తున్న వైఖరి పట్ల విచారం వ్యక్తం చేశారు. తమ కోరికలను సాధించుకునేందుకు ఆందోళనను ఉధృతం చేయవలసిందిగా చెరుకు రైతులకు ఆయన విజ్ఞప్తి చేశారు. అంతర్జాతీయ మార్కెట్‌లో చక్కెరకు మంచి ధరలు రావడం వల్ల పొందుతున్న భారీ ఆదాయంలో చెరుకు రైతులకు వాటా ఇవ్వవలసిందని కేంద్ర ప్రభుత్వాన్ని ఆయన కోరారు.

చెరుకు రైతులు పదేపదే విజ్ఞప్తి చేసినప్పటికి 1974—75 సీజన్‌కు చెరుకు కనీస ధరను తక్కువస్థాయిలోనే ఉంచినందుకు కేంద్ర ప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరి పట్ల సమావేశం ఆగ్రహం వ్యక్తం చేసింది. దేశంలోనూ, విదేశీ మార్కెట్లలోనూ పెరుగుతున్న గిరాకికి తగ్గట్లుగా చక్కెర ఉత్పత్తిని అధికం చేయగలిగేందుకుగాను చెరుకు కనీస ధరను సాధ్యమైనంత త్వరలో పెంచవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని అర్థించింది.

చెరుకు రైతులు సరఫరా చేయడానికి అంగీకరించిన చెరుకులో 85 శాతం మేరకు సరఫరా చేయలేక పోయారనే నెపం మీద చెరుకుకి అదనపు ధర నిరాకరిస్తూ కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులో "పీనల్" నిబంధనలు పొందు పరచడంపట్ల కార్యాచరణ సంఘం తీవ్ర ఆందోళన వెల్లడించింది. ఇది చెరుకు రైతులపై కక్ష సాధించేందుకు చక్కెర మిల్లుల మేనేజుమెంట్లకు అవకాశం ఇవ్వడం తప్ప మరేమీ కాదనీ, అందువల్ల ఆ ఉత్తర్వులో పీనల్ నిబంధనలను తొలగించవలసిందనీ కోరింది.

నిరసన తెల్పుతూ, గిట్టుబాటు అయిన ధర ఇవ్వాలన్న తమ వాదానికి భంగం లేకుండా ఫ్యాక్టరీలకు చెరుకు సరఫరా చేయవలసిందని చెరుకు రైతులకు కార్యాచరణ సంఘం విజ్ఞప్తి చేసింది. ఫ్యాక్టరీల మేనేజుమెంట్ల వైఖరినిబట్టి చెరుకు సరఫరా చేయాలో, వద్దో స్వయంగా నిర్ణయించుకొనవలసిందని స్థానిక చెరుకు రైతుల సంఘాలకు సంఘం సలహా ఇచ్చింది.

ఖండసారి చక్కెర పరిశ్రమపై కొత్త ఆంక్షలను, భారాలను విధించరాదని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను సంఘం అర్థించింది. లఘు పరిశ్రమ అయిన ఖండసారి చక్కెర పరిశ్రమను సర్వవిధాల ప్రోత్సహించాలనీ, ఈ పరిశ్రమవల్ల రైతులు ప్రయోజనం పొందడమేకాక, గ్రామీణ ప్రాంతాలలో ఉపాధి సదుపాయాలు లభిస్తున్నాయనీ తెల్పింది.

శ్రీయుతులు వి. సూర్యారావు, సి. శివరామకృష్ణయ్య, ఎం. అంజయ్య, ఎ. కె.ఆర్. రామకృష్ణయ్య, ఎం. అంజయ్య, ఎ. కె.ఆర్. బి. కోటేశ్వరరావు, బి. వెంకటకృష్ణయ్య, జి. మునయ్య, పి. భాస్కరరాజు తదితరులు ప్రసంగించారు.

### శృంగేరి పీఠానికి వారసులుగా శ్రీ భారతీ తీర్థస్వామి నియామకం

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 18: జగద్గురు శృంగేరి శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వాముల వారు, తమ తరువాత శ్రీ శారదాచంద్ర మౌళీశ్వర పీఠానికి వారసులుగా శ్రీ భారతీ తీర్థస్వాముల వారిని మొన్న శృంగేరిలో ప్రకటించారు.

ఆ సభలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, దేవాదాయమంత్రి రాజాసాగి సూర్యనారాయణరాజు, కర్నాటక గవర్నర్ శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా, రెవెన్యూ మంత్రి శ్రీ హచిమస్తి గౌడ ఉండడం సంతోషకరమన్నారు. శ్రీ భారతీ తీర్థస్వాముల వారు పూర్వాశ్రమంలో శ్రీ తంగిరాల సీతారామాంజనేయులను పేరుతో శృంగేరి లోనే మహాస్వాముల వారితో ఉంటున్నారు. నర్సరావుపేట వాస్తవ్యులైన శ్రీ వెంకటేశ్వర అవధాన్లుగారి పుత్రులైన వీరు కొన్నేళ్ల క్రితం మహాస్వాములవారిని ఉజ్జయినిలో దర్శించి అప్పటినుంచి వారితోనే ఉంటూ అనేకశాస్త్రాలలో పాండిత్యాన్ని గడించారు. వారికి ఈ నెల 10,11 తేదీలలో మహాస్వాములవారు సన్యాసాశ్రమం ఇచ్చి తమ శిష్యులుగా స్వీకరించారు.

సద్విద్యా సంజీవనీ సంస్కృత కళాశాల వజ్రోత్సవాలకు కర్నాటక గవర్నర్ శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా ప్రారంభోత్సవంచేస్తూ సంస్కృత భాషను, ఆదరించాల్సిన అవసరాన్ని గురించి చెప్పారు. రెవెన్యూ మంత్రి శ్రీ హచిమస్తిగౌడ సభకు అధ్యక్షత వహించారు.

శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వాములు వారు మాట్లాడుతూ యతీశ్వరులకు వసుధయేకుటుంబమన్నారు. తాము జన్మతః తెలుగు వారమని, తమ తరువాత రాబోయేవారు కూడా తెలుగువారేనని, అయితే ఉభయులకు ఆధ్యాత్మిక దృష్టియే తప్ప, వేరు దృష్టిలేదని అన్నారు.

### విశాఖ చేపలరేవు: మునుస్వామి వివరణ

నెల్లూరు, నవంబరు 18: మత్స్య పరిశ్రమ, చిన్నరేవుల అభివృద్ధిశాఖమంత్రి శ్రీ దామోదరం మునుస్వామి నిన్న యిక్కడ విలేకరులతో మాట్లాడుతూ విశాఖపట్నంలో చేపలరేవు నిర్మాణం చాలా కాలంగా అపరిష్కృతంగా ఉన్నముఖ్యమయినవ్యవహారమనిఅన్నారు.

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు కేంద్రంలో చర్చలు జరిపినప్పుడు ఈ అంశానికి అత్యధిక ప్రాధాన్యం యిచ్చారని, రేవు నిర్మాణానికి సంబంధించి అసలు అంచనా రూ 2.5 కోట్లు, సవరించిన అంచనా రూ. 3.57 కోట్లుగాను వుండే విధంగాను చేయగలిగారని యిప్పుడు రేవునిర్మాణం విషయంలో పని పురోగతిలో ఉన్నదని ఆయన తెలియ చేశారు. నెల్లూరుతాలూకాలోని కృష్ణపట్నం రేవు కోసం రూ.120000లు కేటాయించబడినాయని కూడా ఆయన చెప్పారు. (స్వ.వి)

### సవరణ

16 వ తేదీ ఆంధ్రపత్రిక 2 వ పేజీలో "నాసిరకం పంచదార సప్లయి: తణుకు మిల్లు అధికార్లపై కేసు" కింద ప్రచురణ అయిన వార్తలో "ఆంధ్రా సుగర్సు జనరల్ మేనేజరు చౌల్ల బలిరామయ్య"కు బదులు "ఆంధ్రా సుగర్సు జాయింటు మేనేజింగు డైరెక్టరు" అని సవరించి చదువుకోగోరుతున్నాం. —సం)

### బాలకాండం
యామిజాల పద్మనాభస్వామి

**6 వ సర్గ**

తస్యాంపుర్యా మయోధ్యాయాం
వేదవిత్సర్వ సంగ్రహః
దీర్ఘదర్శీ మహాతేజాః
పౌర జానపదప్రియః 1

ఆ అయోధ్యయందు నివసిస్తూ పరిపాలిస్తున్న దశరథమహారాజు వేదములను వల్లెవెయ్యడమేకాక వేదాల అర్థము కూడా బాగా తెలిసినవాడు. ధీరులు, శూరులు, వీరులు అయిన సైనికులనూ, వారికి తగిన సైన్యాధిపతులనూ, వేదశాస్త్రాలు నేర్చిన విద్వాంసులనూ వారిని పోషించడానికి తగిన సంపదనూ సమృద్ధిగా సమకూర్చుకున్నవాడు. దుర్గ సంరక్షణలో స్వయం పర్యవేక్షణ గలవాడు. ఏ పని సాధించాలన్నా రాబోయే కష్ట సుఖాలను బాగా ఆలోచించే దూరదృష్టి కలవాడు. తేజస్వి, సాటిలేని పరాక్రమం కలవాడు. పౌరులకూ తన అధికారం చెల్లుతున్న దేశీయులకూ ఎంతో ఇష్టుడు. . . .

ఇక్ష్వాకూణా మతిరథో
యజ్వా ధర్మపరోవశీ
మహర్షికల్పో రాజర్షి:
స్త్రిషులోకేషు విశ్రుతః 2

ఇక్ష్వాకు వంశీయులలో అతిరథుడు. యథావిధిగా యజ్ఞాలు చేసినవాడు. కులోచితములైన ధర్మములను తప్పనివాడు. ప్రజలను తన చెప్పుచేతలలో ఉంచుకున్నవాడు. మహర్షి కుమారుడు. క్షత్రియ రూపములో ఉన్న ఋషి. ముల్లోకాలలో పేరు పెంపులు గలవాడు.

(పదివేల మంది మహారథులతో ఒంటరి యుద్ధము చేసేవాడు అతిరథుడు.)

బలవాన్ హతామిత్రో
మిత్రవాన్ విజితేంద్రియః
ధనైశ్చ సంచయై శ్చాన్యైః
శక్ర వైశ్రవణోపమః 3

అసంఖ్యాకమైన చతురంగ బలం కలవాడు. తన పరిపాలనలో 'పగ' అనే అక్షరాలు తుడిచి వేసినవాడు. అన్నివిధాలా యోగ్యులైన మిత్రులు కలవాడు. జితేంద్రియుడు. సువర్ణ రత్న దివ్యాంబరాభరణాది సంపదలతోనూ, తరగని ధనాగారము లోనూ ఇంద్ర కుబేరులకు సాటియైనవాడు.

(వైభవానికి ఇంద్రుడు, ధనసమృద్ధికి కుబేరుడు.)

[సశేషం]

## జాబులు

### యర్నగూడెం - పొంగుటూరు రోడ్డు

ఆర్యా! యర్నగూడెం—పొంగుటూరు రోడ్డు ఏలూరు—కొవ్వూరు రోడ్డుగా యర్నగూడెం నుండి సింగాయగూడెం, గాంధినగరం, చిన్నాయగూడెం, కుంటలగూడెం, యాదవోలు, వెదుళ్ళకుంట, కన్నాయగూడెం గ్రామములను కలుపుకొనుచూ సుమారు తొమ్మిది మైళ్ళ పొడవు కలిగి పొంగుటూరు వద్ద నర్సాపురం—కొయ్యలగూడెం రోడ్డుతో కలియుచున్నది. ఈ రోడ్డు ప్రక్క గ్రామముల రైతులు నారింజ, నిమ్మ, జామ్ తోటలు, అరటి, వర్జీనియా, పుగాకు మున్నగు వ్యాపార పంటలు ఎక్కువగా పండించుచున్నారు. సదరు పంటలు యావత్తు ఒక వైపున కొయ్యలగూడెం, జంగారెడ్డిగూడెం మార్కెట్లకు, మరో వైపున నిడదవోలు, తాడేపల్లిగూడెంమార్కెట్లకు పోవలసి ఉన్నది.

ఈ రోడ్డునకు 1966—67 సం.ములో గ్రావెలు పోసినారు. 1969 సం.ములో తుఫానుకు గురియై రోడ్డు చాల వరకు పాడైనది. అప్పటినుండి యాదవోలు మరియు చిన్నాయగూడెం ప్రజలు జిల్లా అధికారులకు అనేక వర్యాయములు రోడ్డు పరిస్థితిని గూర్చి విజ్ఞప్తులు చేసి ఉన్నారు. అయినప్పటికి అధికారులు ఇంతవరకు సదరు రోడ్డు ఆవశ్యకతను గుర్తించలేదు. 1969 సం॥ము నుండి లారీలు పరిగారాక రైతులు అనేక ఇక్కట్లు పడుచున్నారు. యీ ప్రాంతములో సుమారు 2,500 ఎకరములలో పండించుచున్న వర్జీనియా పుగాకు కూడా బయటి మార్కెట్లకు పోవుటకు అనేక వ్యయప్రయాసలకు గురికావలసి వచ్చుచున్నది.

ఉన్న ఒక్క ప్రయివేటు బస్సు సక్రమముగా నడుచుటకు రోడ్డు ఎంత మాత్రము అనువుగా లేదు.

ఈసరికే అధ్వాన్న స్థితిలో ఉన్న ఈ రోడ్డు ది.14.10.74 తేదీ రాత్రి, 15.10.74న కురిసిన భారీ వర్షముల (సుమారు 14 అంగుళాలు) వల్ల పూర్తిగా నాశనమైనది. ప్రస్తుతం ఈ రోడ్డుపై సైకిలు ప్రయాణం కూడా మిక్కిలి ప్రమాదకరంగా ఉన్నది.

మూలె సుబ్బారావు, యాదవోలు, ప. గో. జిల్లా.

### కడపలో కాలేజీలు

ఆర్యా! 31.10.74 నాటి ఆంధ్ర పత్రికలో "కడపలో చాలా ప్రభుత్వ కళాశాలలు ఉన్నాయి" అన్న విషయం చదివి నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు. కడపలో ఉన్నది ఒకే ఒక ప్రభుత్వ కళాశాల. ఇక వేరే డిగ్రీ కళాశాలలు ఏవి లేవు.

కడపజిల్లా మొత్తంమీద రెండే రెండు డిగ్రీ కళాశాలలు ఉన్నాయి. ఇక్కడఉన్న ఇండస్ట్రియల్— ట్రెయినింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో కూడా చాలా తక్కువ కోర్సులు ఉన్నాయి. కడపలో పోస్ట్‌గ్రాడ్యుయేట్స్ కోర్సులు పెడతారని అడపాదడపా పత్రికలలో వార్తలు చదవటమే కాని, ఇంతవరకు పెట్టలేదు.

కడపజిల్లా రాయలసీమలో వెనుకబడి ఉంది. శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానములోని అష్టదిగ్గజములలో అగ్రగణ్యుడైన పెద్దనామాత్యుడు జన్మించిన ప్రాంతమిది. శ్రీకృష్ణ దేవరాయల పేరిట ఒక విశ్వవిద్యాలయం స్థాపించవలసిన పట్టణం కడప.

పాతనర్సి సత్యనారాయణ, 5, 72, అప్పారావారి వీధి, కడప.

### ఇదినాకొద్దు కృతం
కె. రామలక్ష్మి

#### రాబోయే పీడకల

చాలామంది నన్ను అడుగుతూ వుంటారు— 'అవకాశం కల్గినప్పుడల్లా ఎందుకునీవారు పరిమిత కుటుంబాల గురించి, కుటుంబ నియంత్రణ గురించి రాస్తూంటారు?' అని. 'ఆవిడకదోగొప్ప' అని నావెనకాల అనుకునే వాళ్ళు కూడా లేకపోలేదని నాకు తెలుసు. అయినా నాముందుర అనలేని వాళ్ళతో నాకు వాదన దేనికి? కుటుంబ నియంత్రణ అన్నది ఇప్పటికీ రహస్యంగా చర్చించుకోవలసిన విషయం అనీ, నల్గురూ వింటూండగా ఆడవాళ్ళు దీన్ని గురించి చర్చించడం చాలా సిగ్గుచేటు అనీ అనుకుంటూ వుంటారు. కాని ఇది వ్యక్తిగతంగా సిగ్గుచేటు అనిపిస్తున్నా దేశానికి గొడ్డలిపెట్టు అయినప్పుడు—దేశం నీదని అనుకుంటున్నప్పుడు, ఆ దేశంలో బాధ్యతగల వ్యక్తిగా నీవు బ్రతుకుతున్నప్పుడు దేశాన్ని దెబ్బతీయడం—నిన్ను నీవు దెబ్బ తీసుకోడం లాంటిదని నాకనిపిస్తుంది. అందుకే మూర్ఖత్వం అనే చెవుడుతో బాధపడుతున్న వాళ్ల దగ్గర శంఖం కొరుకుతున్నాను అంటూ వుంటాను. కొడుకు లేకపోతే పున్నామనరకం అంటారేగాని ఆ కొడుకు పుట్టడంకోసం భారాన్ని తెగసెందుకుంటే ప్రత్యక్ష నరకం అని చాలా లేటుగా తెలుసుకుంటూ వుంటారు. జనాభాను తగ్గించండి మొర్రో అని ఎన్ని రకాల ప్రచారం చేసినా, అది విన్నప్పుడల్లా ఓ ముసిముసి నవ్వు పారేసి అది తమకి కాదని గారు కుంటారు. ఇటువంటి నిర్లక్ష్యాన్ని నిద్రాణాన్ని ఒదద్దాలంటే జనాభా యిలాగే పెరుగుతూ పోతే—ఈ భూమి భారం ఎలా వుంటుందో అంచనాలు కట్టారు శాస్త్రజ్ఞులు. చావడం రేటుకీ పుట్టడం రేటుకీ పొంతన కుదరడంలేదు—ప్రపంచంలో ఆరోగ్య పరిరక్షణ పథకాలు ప్రసూతి శిశువైద్య సౌకర్యాలు బాగా పెరుగు పోవడం వల్ల.

అసలు తొలినుంచీ జనాభా పెరుగుదల ఎలా వుంది? ఎనిమిది వేల బి. సి. నాడు ప్రపంచ జనాభా ఐదు మిలియన్లు. ఇంకో పదివేల సంవత్సరాలకి గాని ప్రపంచ జనాభా ఐదువందల మిలియన్లు కాలేదట (అంటే దాదాపు 1650 నాటికి) అంటే జనాభా ప్రతివెయ్యి సంవత్సరాలకీ ఒసారి రెట్టింపు అయింది. 1850 నాటికి ఒక బిలియను అయిన యీ జనాభా పెరుగుదల రెండువందల సంవత్సరాలకి దిగిపోయింది! తరువాత రెట్టింపు కాడానికి ఎనభై సంవత్సరాలే పట్టిందిట. 1930 నాటికి ప్రపంచ జనాభా రెండు బిలియన్లు. ప్రస్తుతం ముప్పయి అయిదు సంవత్సరాలకోసారి రెట్టింపు అయిపోతోంది. ప్రస్తుత జనాభా నాలుగుబిలియనులు.

ఈ రేటున యింకో వెయ్యేళ్ళు పెరిగేసరికి ప్రతి మనిషికీ ఒక చదరపుగజం నేల, నీరు కలిసి మిగులు తుందట. ఇలా నీరు నేసిన అంచనాలు చదివితే—అదో భయంకరమైన పీడకలగా తోచకతప్పదు. ప్రస్తుతం వున్న సుఖమయ జీవితంచూసి మనపిల్లలు మోసపోయే అవకాశం వుంది. వారితరం వచ్చేసరికి ఇదంతా ఏం మిగలదు. ఈరోజు మనం కరువు, దుర్భిక్షం, ఉపద్రవం ఎదురు చూసే ప్రమాదంకేసి ప్రయాణం చేస్తున్నామే గాని, రేపు మన సంతతి వాటికి బలిఅయిపోగలదు— అని ఆలోచించడంలేదు. అదిమనం చేయవలసిన పని.

### మా ఊరి సమస్య

#### చింతిరేల పంచాయతీ భవనం

(10రూ.లబహుమతిపొందినలేఖ)

1968లో శంఖుస్థాపన చేసిన పంచాయతి భవనం సగం పూర్తి అయింది. ఇది ఇప్పుడు చెట్లలో నిండిపోయి మరుగు దొడ్డిగా ఉపయోగపడుతోంది.

యక్కంటి సత్యనారాయణరెడ్డి, చింతిరేల పోస్టు, బూర్గంపహాడ్ తాలూకా, ఖమ్మం జిల్లా.

#### వేపగుండ్ల కొళాయిలు

కొళాయిలు ఉన్నాయి కాని వాటిలో నీరు లేదు. ఇదే మావూరి సమస్య.

పి.ఎస్.బాబు, బి.కాం., వేపగుండ్ల పోస్టు, పుత్తూరు తాలూకా, చిత్తూరు జిల్లా.

#### కాజ సమస్య

మా వూరిలో 10,000మంది పైగా జనం ఉన్నారు. మేజరు పంచాయితీ. వర్షాకాలంలో బయటి ప్రపంచంతో సంబంధం ఉండదు.

ఎస్. ఎస్. నాయుడు, కాజ, కృ.జి.

## దినఫలం

**19-11-1974 మంగళవారం**
శక సం. 1896 కార్తీకమాసం 28

★ మేషం: అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.
★ వృషభం: మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.
★ మిథునం: వృత్తి వ్యాపారాల్లో చికాకులు ఏర్పడతాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.
★ కర్కాటకం: ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరగలదు. కుటుంబ సంతోషం లభిస్తుంది.
★ సింహం: మీరు అనుకొనేది ఒకటి. జరిగేది మరొకటి కావచ్చును. దైవకార్యాలు నెరవేరతాయి.
★ కన్య: ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.
★ తుల: అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.
★ వృశ్చికం: వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి.
★ ధనస్సు: మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి.
★ మకరం: అన్ని వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.
★ కుంభం: మీ కార్యక్రమాల్లో శ్రమ కలుగుతుంది. అననుకూలమైన వార్తలను వింటారు.
★ మీనం: ఇదివరకు మీరు చేసినప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందగలదు.

— మహేష్

## సంక్షిప్త వార్తలు

### చీరాల

చీరాల వి.ఆర్.ఎస్. అండ్ వై.ఆర్.ఎన్.కళాశాలలో ఎం. కాం. కోర్సు ప్రారంభించడానికి గల సావకాశాలను పరిశీలించడానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ శ్రీ కె. వి. శివయ్య యిక్కడకు వచ్చారు. ప్రిన్సిపాల్‌తోను, యాజమాన్యం వారితోను సంప్రదింపులు జరిపారు. ఎం. కాం. తరగతులు డిసెంబరు నాటికి ప్రారంభం కాగలవని తెలుస్తున్నది. (స్వ.వి)

### పాలకొల్లు

పాలకొల్లు వాటర్‌వర్క్స్ ఎంప్లాయీస్ యూనియన్‌కు యీ దిగువ కార్యవర్గం ఎన్నికయింది.

శ్రీ మానెం నరసింహమూర్తి గౌరవ అధ్యక్షుడు. శ్రీ వి. వి. వి. సత్యనారాయణ అధ్యక్షులు. శ్రీ కె. అచ్యుతరామారావు ప్రధాన కార్యదర్శి, శ్రీ ఎం. కృష్ణమూర్తి ఉపాధ్యక్షులు, శ్రీ కె. ఎస్. వి. సత్యనారాయణ కార్యదర్శి. శ్రీ బి. నరసింహారావు కోశాధికారి.

### కర్నూలు

కర్నూలు పట్టణ సాయిబ్రాహ్మణ కళాకారుల సంఘంకు ఈ దిగువ కార్యవర్గం ఎన్నికయింది: శ్రీ సి. ఎం. మునిరామయ్య అధ్యక్షులు, డా. బి. గౌరయ్య, శ్రీ పి. రాజమల్లు ఉపాధ్యక్షులు, కార్యదర్శి శ్రీ ఎం.సి. పుల్లయ్య, సహాయ కార్యదర్శి శ్రీ పి. ఎస్. లక్ష్మణ, శ్రీ కె. వెంకటేశ్వర్లు, కోశాధికారి శ్రీ లోహిరాజు.

## చిత్ర విచిత్రం
శ్రీనివాస్



### "వెలుగు బాటలు"

మద్రాసు మహానగరంలో బాటి మూవీస్ అనే కొత్త నిర్మాణ సంస్థ వెలిసింది. ఆ సంస్థ "వెలుగు బాటలు" అనే చిత్రాన్ని నిర్మిస్తోంది. ఇప్పటికి రెండు షెడ్యూల్స్ షూటింగ్ పూర్తయింది. ఈ చిత్రానికి కొత్త దర్శకుడ్ని ఎన్నుకున్నారు. నిర్మాత పి. యస్. ఆర్. దాసి. అతనిపేరు బి. యస్. ప్రకాశరావు, పైపేరుతో పున్నవ్యక్తి. ఇతనికిదర్శకత్వంలో పదిహేనేళ్ల అనుభవం ఉంది. దర్శకులు కె. బి. నాగభూషణం, చాణక్య, రంగదాస్‌గార్ల దగ్గర శిష్యరికం చేసిన ఇతను ఆ శాఖలోని అంగాంగాలను బాగా జీర్ణించుకున్నాడు.

కొత్త, పాత నటీనటులతో రెగ్యులర్‌గా షూటింగు జరుపుకుంటున్న ఈ చిత్రాన్ని త్వరలో పూర్తి చేసి జనవరిలో విడుదల చేయాలని, నిర్మాతలు, దర్శకుడు అభిప్రాయ పడుతున్నారు. కొత్తవారి అభిలాష, అభిమతం, విజయం కావాలని ఆశిద్దాం. ప్రకాశరావు పేరు పెట్టుకున్న ఈ చిత్ర దర్శకుడు ఆ పేరుకు పూర్తి న్యాయం చేకూర్చ గలరని విశ్వసిద్దాం.

### చిత్రసమీక్ష:

#### అమ్మ మనసు

చితి మంటల చిటపటలలో కూడా "చిరంజీవ" అని దీవించే దైవం అమ్మ ఒక్కటే అన్న నగ్న సత్యాన్ని విజయలక్ష్మి మూవీస్ వారి "అమ్మమనసు" చిత్రంలో సోదాహరణగా చూపించారు.

ఈ చిత్రానికి కథను, స్క్రీన్‌ప్లేను వ్రాసిన దర్శకుడు కె. విశ్వనాథ్ చూపిన పనితనం వల్ల చిత్రం చివరివరకూ ఎంతో ఆసక్తిదాయకంగా నడుస్తుంది.

కథలో "టెంపో" ఉండేటట్లు చేయడంలో తనకుగల చాకచక్యాన్ని విశ్వనాథ్ మరోసారి ఈ చిత్రం ద్వారా నిరూపించుకొన్నారు. ముఖ్యపాత్రలను ధరించిన సత్యనారాయణ, జయంతి, శుభ, భారతి, చలం, మాస్టర్ బాబ్జీ ప్రశంసనీయమయిన నటనను ప్రదర్శించారు. కె. విజయ వాంప్‌గా రాణించింది. డి. వి. నరసరాజు మాటలు, కృష్ణశాస్త్రి, నారాయణరెడ్డి, సీటూరి, పాటలు పసందుగా ఉన్నాయి. ముఖ్యంగా "చిట్టిపొట్టి పిచికలు లేచారా! చిక్‌చిక్ రైలుబండి పాటలు బాగా ప్రచారంలోకి వస్తాయి. సంగీతం కె. వి.మహాదేవన్ సమకూర్చారు.

టైటిల్స్‌లో "కొత్త ప్రయోగం" జరిగిన "అమ్మమనసు" తన "సెంటిమెంటాలిటీ"తో ప్రేక్షకులను, ముఖ్యంగా మహిళలను బాగా ఆకర్షిస్తుంది. ఈ చిత్రం నవయుగ విడుదల.

— వెంకట్రావ్

